కావ్యపరిచయాలు

# మను చరిత్ర

## అల్లసాని పెద్దన


సంపాదకుడు

శ్రీ ఎం. వి. యల్. నరసింహారావు

నూజివీడు






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

కావ్యపరిచయాలు

# మను చరిత్ర

## అల్లసాని పెద్దన


సంపాదకుడు

శ్రీ ఎం. వి. యల్. నరసింహారావు

నూజివీడు






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

# తొ లి ప లు కు

తిక్కన యుగము నుంచి తిరుపతి వేంకట కవుల యుగము వరకు అనగా కొన్ని నూర్ల సంవత్సరాల పాటు తెలుగు సాహిత్యానికి ఒక విశిష్టతను చేకూర్చినది ప్రబంధమండలి విభాగము. తెలుగు ప్రబంధాలు కావ్య శిల్పానికి ఆటపట్టులు-పండితులకే కాక రసజ్ఞులకు కూడ యీ ప్రబంధాలలోని ముఖ్యమైన పద్యాలు కంఠస్థాలు. ప్రాచీనాంధ్ర సాహిత్యములో అనేక శతాబ్దాల పాటు ప్రధానస్థానము నాక్రమించిన యీ ప్రబంధాలను కొన్నింటిని పాఠక లోకానికి అందించవలెనని నిశ్చయించి ఆంధ్ర కేంద్ర ప్రభుత్వముల సహకారముతో యిప్పటి వరకు ౪౨ కావ్యాలను అకాడమి ప్రకటించినది. ప్రతి కావ్యానికి ౪౦ పేజీల పీఠికను సమర్థులైన సంపాదకులచే వ్రాయించినది. ఇట్లు ప్రచురించిన కావ్యాలు జనాదరణ పొందినవి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అనేకమైన సారస్వత కార్యక్రమాలను రూపొందించినది. ఇప్పటి వరకు రెండు నూర్లకు పైగా గ్రంథాలను ప్రకటించినది. ఇందులో పరిశోధనకు సంబంధించిన గ్రంథాలతో పాటు సాహిత్య ప్రధానమైన గ్రంథాలు గూడ ఉన్నవి. ప్రాచీన వాఙ్మయాన్ని, ఆధునిక వాఙ్మయాన్ని రెండింటిని ప్రోత్సహించుట సాహిత్య అకాడమి ఆశయము.

సాహిత్య అకాడమి ప్రకటించిన ప్రబంధాలను పరిశీలించిన విజ్ఞులు కొందరు ప్రబంధాలను కొన్నింటిని లఘు పుస్తకాల ద్వారా పరిచయము గావించుట బాగుండగలదని సూచించినారు. ఈ సూచనకు శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారి ప్రేరణ తోడైనది. తత్ఫలితముగా పారిజాతాపహరణము, మనుచరిత్ర, ఆముక్త మాల్యద, వసుచరిత్ర, పాండురంగ మాహాత్మ్యములను అయిదు లఘు పుస్తకాల ద్వారా పరిచయము చేయవలెనని అకాడమి కార్యవర్గము నిర్ణయించినది. అందరికి అందుబాటులో నుండవలెనను ఉద్దేశముతో వీని వెల కూడ స్వల్పముగా నిర్ణయించనైనది.

ఈ అయిదు పుస్తకాలను సిద్ధము చేసినవారు శ్రీ ఎం. వి. ఎల్. నరసింహారావుగారు. వారు నూజివీడు ధర్మ అప్పారావు కళాశాలలో తెలుగు ఉపన్యాసకులు. మేము కోరినదే తడవుగ యీ పుస్తకాలను సిద్ధముచేసి యిచ్చిన శ్రీ నరసింహారావుగారికి అకాడమి పక్షాన కృతజ్ఞతలు. ఇక ముందు మరికొన్ని కావ్యాలను యీ విధముగ పరిచయము చేయవలెనని అకాడమి సంకల్పము. ఆంధ్ర మహాజనుల ఆదరణ యిందుకు లభించగలదని విశ్వాసము.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

హైదరాబాదు
12-3-74

# కవిపరిచయం

పెద్దనను కవిలోకానికి పెద్దన్నగా, మనుచరిత్రను ప్రథమాంధ్ర శృంగార ప్రబంధంగా అందరూ మన్నిస్తారు. పండితులేకాక పామరులు కూడా భారత భాగవతాల తరవాత మనుచరిత్ర పేరే ఎన్నిక చేస్తారు. పర స్త్రీని కన్నెత్తి చూడని ధర్మమూర్తి ప్రవరుడ. వనిత వలచివస్తే చులకనయిందని వాపోయే భోగకాంత వరూధిని. ఇద్దరూ ప్రతి మనిషి హృదయంలోనూ సంఘర్షించే ధర్మాధర్మాల ప్రతిరూపాలు.

కనుకనే ఈనాడూ ఏనాడూ సజీవంగా కనబడతారు. కథ హృదయానికి హత్తుకొనిపోతే కథనం మనసును వశం చేసుకుంటుంది. వెరసి పాఠకుడు మనుచరిత్రకు, పెద్దనకు అంకితమై పోతాడు. కాకమాని మూర్తికవి 'పాంచాలీ పరిణయం' అనే కావ్యంలో "అల్లసాని వాని అల్లిక జిగిబిగి" అని పెద్దన కథనాన్ని ప్రశంసించాడు. దూబగుంట నారాయణ కవి రచించిన పంచతంత్రాన్ని అంకితం పుచ్చుకున్న బసవ భూపాలుడు "మనుచరిత్ర సంతతానందుడ"ని సాక్ష్యం దొరుకుతుంది. పండితుల్ని పట్టీలు కొట్టించే ఆముక్త మాల్యద రచించిన కృష్ణదేవరాయలు పెద్దన కాలికి గండపెండేరం తొడిగాడు మనుచరిత్ర అంకితం తీసుకునే వేళ పెద్దన అధిరోహించిన పల్లకికి తాను బోయిగా మారాడు.

"హితుడవు, చతురవచోనిధివి,
పురాణాగమ, ఇతిహాస కథార్థాలు

తెలిసినవాడవు. ఆంధ్ర కవితా పితామహుడవ"ని పెద్దనకు నమస్కరించాడు. ఎవరి కవితనైనా అపహసించే కవి చౌడప్ప "పెద్దనవలె కృతి చెప్పిన పెద్దనవలె" అని పెద్దనకు పెద్దపీట వేశాడు.

అల్లసాని పెద్దన 1470 ప్రాంతాన జన్మించి 1533 ప్రాంతాన మరణించి వుంటాడని విమర్శకుల అభిప్రాయం. బళ్లారిలోని దోరాల అనే గ్రామంకాని, కడప మండలంలోని కోకట గ్రామం కాని, పెద్దనపాడు కాని పెద్దన జన్మస్థలం కావచ్చునని పలువురి అభిప్రాయం. కృష్ణరాయల ఆస్థానకవిగా, అష్టదిగ్గజాలలో ప్రముఖుడుగా పేరుకెక్కిన తరవాత పెద్దన కోకటగ్రామాది అనేక

గ్రామాలు రాయల దగ్గర్నించి దానం పుచ్చుకున్నాడు. కటకసీమ నాయం కరంకూడ లభించింది. 'ఏకాంత ప్రదేశం' రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చే తాంబూలం లేనిదే కవిత చెప్పనన్న పద్యాన్ని బట్టి పెద్దన భోగపరాయణుడని కొందరు భావించారు. ఆ చాటు పద్యం పెద్దనదైనా కాకపోయినా, పెద్దన భోగ పరాయణుడైనా కాకపోయినా ఆయన దానశీలుడన్న విషయం మాత్రం శిలా శాసనంగా తెలుస్తుంది. కోకట గ్రామంలో కొంతభాగాన్ని సకలేశ్వర దేవుని ధూపదీప నైవేద్యాలకు పెద్దన దానం చేశాడు. అలాగే కొంత భూమిని చెన్న కేశవ స్వామి దీపారాధనకు దానమిచ్చాడు. కోకట గ్రామంలో పినాకినీ నది నించి ఒక కాలువ తవ్వించాడు. ఇవన్నీ పెద్దన పెద్దమనసును తెలియ జేస్తాయి. శివుడన్నా కేశవుడన్నా సమభావం కలవాడని నిరూపిస్తాయి.

మనుచరిత్రకు ముందు పెద్దన హరికథాసారం అనే కావ్యాన్ని రచిం చాడు. అది తన గురువైన శఠకోపయతికి అంకితం చేశాడు. ఇప్పుడా గ్రంథం లభించటంలేదు. కాని దొరుకుతున్న ఏడెనిమిది పద్యాలను బట్టి ఆ కావ్యం శ్రీహరి అవతార కథల్ని కథనం చేస్తుందని తెలుస్తుంది.

శ్రీకృష్ణ దేవరాయలు భువన విజయసభా మంటపంలో కొలువై, సప్త సంతానాలలో నశించకుండా నిలిచేది కావ్యమే కాబట్టి శిరీష కుసుమంలా మృదు వైన పదాలతో కావ్యరచన చేయవలసిందని పెద్దనను కోరాడు. మనువులలో స్వారోచిష మనువు చరితం రసభరితం కనక మనుచరిత్ర రచించవలసిందని రాయల ఆదేశం. సంస్కృత భాషలోని మార్కండేయ పురాణంలో గల కథే మనుచరిత్రకు మూలం. మార్కండేయ పురాణాన్ని తిక్కన శిష్యుడైన మారన తెలుగు చేశాడు. సంస్కృతాంధ్ర గ్రంథాలలోగల ఆ కథను రసానికి, శిల్పానికి, కథనానికి అనుగుణంగా మార్చుకుంటూ పెద్దన రచన సాగించాడు. మారన మార్కండేయ పురాణంలో నూటయాభై పద్యాలలో ముగిసిన మను చరిత్ర పెద్దన చేతిలో ఎనిమిది వందల పద్యాలకు పెరిగి రసబంధురమైన ప్రబంధంగా రూపొందింది.

మను చరిత్ర తెలుగులో తొలి ప్రబంధం. ప్రబంధమనే నూతన ప్రక్రియకు పాదు చేసినవాడు నన్నెచోడుడు. పందిరి వేసిన వాడు నాచన సోముడు, రసపోషణ చేసినవాడు శ్రీనాథుడు. అయినా ఫలభరితం చేసినవాడు

పెద్దనే అయాడు తెలుగులో తప్ప దక్షిణాదిని గల మరేభాషలోనూ లేని ప్రబంధ ప్రక్రియకు కర్త కావటమే పెద్దన గొప్పతనమైతే పెద్దన పేరు సాహిత్య చరిత్రలో మాత్రమే కానబడేది. దారితీయటమే కాక కవితాశక్తితో రాచబాట వేసినవాడు కూడా పెద్దన కావటంవల్లనే రాయలంతటివాడు ఆంధ్ర ప్రబంధ రచనవైపు దృష్టి మళ్లించాడు. కవితా శ్లేషం చేసిన రామరాజభూషణు డంతటివాడు పేరు దగ్గర్నించి వరవడిగా పెట్టుకొని మను చరిత్రను మించి రచించాలని వసుచరిత్ర సృష్టించాడు. కలం పట్టిన ప్రతికవీ ఆంధ్ర కవితా పితామహుణ్ణే ఆదర్శంగా పెట్టుకొని మనుచరిత్రను అనుసరించే వసుచరిత్రకు పిల్ల వసుచరిత్రలు రచించటానికి తాపత్రయిపడ్డారు. ఇలా ప్రబంధ రచనలో పెద్దనకు ద్వితీయు లెందరున్నా ప్రబంధాలలో మాత్రం మనుచరిత్ర అద్వితీయం గానే నిలబడింది.

ధర్మ ప్రబోధమే సాహిత్యానికి పరమావధి. ప్రభువులా ఆజ్ఞాపించే వేదాలు, మిత్రునిలా హితోపదేశం చేసే పురాణాలు, కాంతలా రసోచితంగా చెప్పే కావ్యాలు ఏవైనా ప్రజల్ని ధర్మమార్గాన నడిపించటానికే. పెద్దన చేతిలో కావ్యం ప్రబంధంగా మారి మరీ అందచందాల్ని సంతరించుకొంది.

ప్రజలు వైదిక ధర్మాన్ని అవలంబించాలన్న ఆశయంతో వేదాల సార మైన భారతానువాదం చేయమని రాజరాజు నన్నయను ఆదేశించాడు. హరి హరుల అద్వైతాన్ని ప్రబోధించటానికే తిక్కన భారతరచన కొనసాగించాడు. అలాగే రాయలు పెద్దనను మనుచరిత్రే రచించమని కోరటానికి ఒక కారణం కనబడుతుంది. రాయల కాలంలో రెండు భిన్న సంస్కృతుల మధ్య సంఘ ర్షణ జరుగుతోంది. ఇహలోక చింతనా ప్రాబల్యంగల మహమ్మదీయుల ప్రవృత్తికి, పరలోక చింతనా ప్రాబల్యంగల హిందువుల తత్వానికి మధ్య ఎంతో అంతరముంది ఇహలోకంలో నిష్ఠను పాటించి పరలోకంలో సుఖానుభూతి పొందటమా? కంటికి కనబడని పరలోక స్పృహ లేకుండా ఇహంలోనే సర్వ సుఖాలను అనుభవించగలమా? అన్న సమస్య హైందవులకు వచ్చింది. మీసాల మీది తేనెలవంటి తుచ్ఛ సుఖాలను ఆశించకుండా ప్రజలు ధర్మమార్గాన సంచ రించటానికి అనువైన ప్రబోధాన్ని ప్రబంధ రూపాన చేయటం మంచిదని తల చాడు రాయలు. ఆ ధర్మానికి రసస్వరూపాన్నిచ్చే కథ స్వారోచిషమను సంభ వమేనని భావించాడు. వరూధినీ ప్రవరుల సంభాషణ ప్రతివారి హృదయంలో

జరిగే సంఘర్షణకు సమాధానమిస్తుందని సంభావించాడు. కనుకనే ఆ కథనే రచించవలసిందని పెద్దనను ఆదేశించాడు.

పెద్దన రాయల ఆశయాన్ని అక్షరరూపంలో అవిష్కరించాడు రస వత్కవితను, సార్వకాలిక, సార్వజనీన పాత్రలను సాక్షాత్కరింప జేశాడు.

పెద్దన ఏనాటికైనా కవులకు పెద్దన్నగానే సాక్షాత్కరిస్తాడు.

## కథా సంగ్రహం

### ప్రథమాశ్వాసం

ఆర్యావర్తదేశంలో వరణానదీతీరానగల అరుణాస్పద పురం భూసతీ కంఠహారానికి నాయకమణి వంటిది. ప్రవరుడు అనే బ్రాహ్మణుడు అనుకూల వతి అయిన భార్య సోమిదమ్మతో ఆ పురంలో కాపురం చేస్తున్నాడు. పట్టణం దాటి అడుగు బయట పెట్టనివాడు. చందమామలా అందగాడు. మన్మథునిలా మనోజ్ఞమైనవాడు. అందగాడేకాని సంపెంగలాటివాడు కావటంవల్ల తుమ్మెదల్లాటి వారకాంతలకు అందరాని వాడయ్యాడు. భాషావైదుష్యంలో అపరశేషుడు. అధ్యాపనతత్పరుడు. అతిథిని పరాత్పరునిగా భావించే సత్పురుషుడు. ఒకరికి దానమిచ్చేవాడే కాని ఎన్నడూ పుచ్చుకొనేవాడు కాడు.

ఒకనాడు సిద్ధుడొకడు వారింటికి అతిథిగా వచ్చాడు. ప్రవరుడు సిద్ధుణ్ణి సేవించాడు. సంసార పంకం నించి బయటపడేసే ఔషధం, మీ పాదధూళి తప్ప మరోటి లేదన్నాడు. అందరినీ అడిగినట్టే సిద్ధుణ్ణికూడా పుణ్యక్షేత్రాల గురించి వివరాలడిగాడు. నలుదిశలా సంచరించానని చెప్పాడు సిద్ధుడు. చిన్న వయసులోనే అన్ని ప్రదేశాలెలా చూడగలిగాడని ప్రవరుడికి ఆశ్చర్యం కలిగింది. అదే అడిగాడు. పరమేశుని కృపవల్ల పాదలేపనం లభించిందనీ, దాని ప్రభావంతో భావవేగాన సంచరించగలుగుతున్నానని చెప్పాడు సిద్ధుడు. ప్రవరుని అంతరంగాన గల తీర్థ సందర్శనాభిలాష ఆ క్షణాన పరవళ్లు తొక్కింది. పాదలేపనం ప్రసాదించి పుణ్యక్షేత్ర గమనం కలిగించమని సిద్ధుణ్ణి కోరాడు. సిద్ధుడొక దంతపు బరిణతీసి యిదీ అదీ అని చెప్పకుండా ప్రవరుని పాదాలకు

పసరుపూసి వెళ్ళిపోయాడు. మహిమాలయమైన హిమాలయ దర్శనం కోరు కున్నాడు ప్రవరుడు.

## ద్వితీయాశ్వాసం

సూర్యుడు నడినెత్తికి వచ్చేవరకు మంచు కొండ మీది వింతలన్నీ చూశాడు. అంతలో మంచునీటికి పాదలేపనం కరిగిపోయింది. ఇల్లు గుర్తు వచ్చింది. ఇల్లాలు గుర్తువచ్చింది. ఎలా చేరటమా అనుకొన్నాడు. ఎందుకు వచ్చానా అని బాధపడ్డాడు. అక్కడొక ఆశ్రమం వంటిది కనబడింది. ముంద డుగు వేశాడు. పిల్లగాలి పలకరించింది. ఇంటికి చేరగలననే ఆశ తొలకరిం చింది. మెరుపుతీగ రూపెత్తినట్టున్న ఒక వనిత కంటబడింది. ఆమె ప్రవరుణ్ణి చూసి కాలి అందెల గలగలతో తొందరపాటు సూచిస్తూ లేచి పోకచెట్టు వెనక పట్టున చేరింది. అతని అందం ఆమె మనసున పన్నీరు చిలకరించింది. శరీరం పులకరించింది. అతడు జయంతునికన్నా, వసంతుని కన్నా ఎక్కువఅందంగా కనబడుతున్నాడనుకొంది. అతడు నన్ను చేపట్టినచో మన్మథ రాజ్యానికి పట్టం కట్టుకోవచ్చునని ఆశించింది. సురగరుడులలో, నరఖేచరులలో, సిద్ధసాధ్యులలో, విద్యాధర గంధర్వులలో ఇతణ్ణి మించిన వన్నెకాడు కన్నుకు తగలడని భావిం చింది.

ప్రవరుడామె విభ్రాంతిని చూశాడు. భయపడినట్లు గమనించాడు భయ పడాల్సిన అవసరం లేదన్నట్లు సంబోధించాడు తనకథ చెప్పాడు. తన వ్యథ చెప్పాడు. ఇంటికి చేరే ఉపాయం చెప్పమన్నాడు. నీకు శుభం కలుగుతుందని ఆశీర్వదించాడు. ఆమెకు నవ్వు వచ్చింది. మనసారా నవ్వుకొంది. ఇంతలేసి కళ్ళుండగా దోవ అడుగుతారేమంది. ఏకాంతంగా ఉన్న కాంతను ఏదో నెపంతో పలకరించటం కాకపోతే మరేమిటన్నది. వచ్చిన దోవ తెలియదా అన్నది. అంతేలే! మేం లోకువగా కనబడటంవల్లేగా ఇంతకూడా భయంలేకుండా అడిగా రన్నది. ఆ అమాయకుడికా సూచన అర్థం కాదేమోనని తన పేరు వరూధిని అనీ, తనది వేశ్యాకులమనీ తెలియజేసింది. రంభాతిలోత్తమల్లాంటి గొప్పగొప్ప వారు తనకు నెచ్చెలులని హెచ్చరికగా చెప్పింది. ఆతిథ్యం స్వీకరించమని కోరింది. నువ్విచ్చదలచిన ఆతిథ్యం మాకు చెందిందన్నాడు ప్రవరుడు. నీభక్తే పదివేలు, ఇంటికి దారి చూపితే అదేచాలు అన్నాడు. గొప్పదానివి కాబట్టి నీకీ

పెద్దవిషయం కాదన్నాడు. వరూధినికి మళ్లా నవ్వు వచ్చింది. ఎక్కడి ఊరంది. కాలు నిలవటం లేదా అని అడిగింది. ఇంకా దాపరికం ఎందుకు? నీ పయి నాకు మనసుంది, మనసు తీరే చోటుంది, తగిన మాటుంది మరింక మాటలెందుకంది. ప్రవరుడు ధర్మం చెప్పాడు. నీతి చెప్పాడు. నియమం చెప్పాడు. తుచ్ఛమైన సుఖాలు మీసాలమీది తేనెలన్నాడు. వరూధిని మొహంతెల్లబోయింది. కంటనీరు తిరిగింది. అంతేలే! ఆడది తనంతట తాను వలచి వస్తే చులకన కాదా అని గద్గద కంఠంతో అంది. పరవశత్వం వివశత్వంగా మారింది. తమకం పట్టలేక ప్రవరుణ్ణి కౌగలించుకొంది. అధరాన్ని ఆశించింది. ప్రవరుడు శ్రీహరిని తలచుకున్నాడు. పెడమోము పెట్టి ఆమె బుజాల్ని పట్టుకొని నెట్టివేశాడు. అతని కర్కశత్వాన్ని ఆమె భరించలేక పోయింది. వేదన ధ్వనిస్తూ, కామన ప్రతిధ్వనిస్తూ కలధ్వనితో ఏడ్చింది. ఎన్ని యజ్ఞాలు చేసినా, జపతపాలు చేసినా భూతదయ లేకపోయిన తరువాత ఫలితం లేదన్న మాట నిజమని పలికింది. నీ చదువెందుకని నిష్ఠురం చేసింది. మునులు ముక్కు మూసుకొన్నారేకాని మక్కువ తీర్చుకోవటం మానారా అని తర్కించింది. పురాణాలు తార్కాణించింది. ప్రవరుడు తన వంటికంటుతున్న జవ్వాది కడిగాడు. ఇల్లు చేర్చమని అగ్నిహోత్రుణ్ణి ప్రార్థించాడు. ఆ దేవుని కరుణతో అరుణాస్పద పురం చేరుకొన్నాడు.

ప్రవరుడు మాయమైనా వరూధిని మనసులో ముద్రపడిన అతని రూపం మాత్రం మాయం కాలేదు. ప్రవరుణ్ణే భావించింది, ధ్యానించింది, ఆరాధించింది. కాంతుడు కాదంటే కైలాసానికి పోయే భూలోకపు కాంతలు అదృష్టవంతులనుకొంది దేవలోక కాంత కావటంతో అమృతత్వం తన పాలిట శాపంగా, తన జన్మే పాపంగా, శూన్య గృహంలో వెలిగించిన దీపంగా మారిందని నిట్టూర్చింది.

వరూధిని మనసులో లాగే బయటకూడా చీకట్లు కమ్ముకొన్నాయి. మలయపవనం మనసుకి సెగలా తగిలింది. చెలికత్తెలు శీతలోపచారాలు చేశారు. తెల్లవారింది. చెలికత్తెలు ఉచితోక్తులతో అనునయించారు. వరూధిననే వరించి, ఆమెకోసం తపించే గంధర్వుడొకడున్నాడు. తనను తిరస్కరించిన వరూధిని గురించే ఆలోచిస్తున్నాడు. జవరాంద్ర చిత్తములు క్షణక్షణములనుకొన్నాడు.

ఏదో ఉపాయంతో వరూథినిని వశం చేసుకోవాలనుకొన్నాడు. ఆమె మనసు ప్రవరుని మీద లగ్నమైందని గ్రహించి శాంబరీ మహిమతో ప్రవరుని రూపాన్ని లావణ్యాన్ని పొందాడు. వరూథిని తనను ప్రవరుడిగా గుర్తించి వెంటపడేవరకు వేచి వున్నాడు. వరూథిని మాయాప్రవరుణ్ణి గమనించింది. అతడు నిజప్రవరుడే నని భావించింది. శిలలు కరిగేలా రోదించింది. కోరిక నివేదించింది. గంధర్వుడు జాలిపడ్డాడు. సర్వస్వం త్యాగం చేస్తున్నట్టు నటించాడు. పరులసేవ కోసం శరీరాన్నయినా ఉపేక్షించాలన్నాడు. నీ దీన స్థితికి వ్రతాన్ని వదిలేశానన్నాడు. కాని సుఖించే సమయంలో కళ్లు తెరవరాదన్నది తమ దేశాచారమని మరవవద్ద న్నాడు. అంటూనే తమి తీరేవరకూ ఆమెతో కలిసివుండే ఒప్పందం చేసు కున్నాడు. వరూథిని నమ్మింది. అతన్నే నమ్ముకొంది. కోరిక నెరవేర్చు కొంది. ఎనలేని ఆనందాన్ని అందించిన కోరికను తన గర్భంలో పెరుగుతున్న ప్రవరుని మారు రూపంగా మార్చుకొంది. మనసు తీరిన గంధర్వుడు మాయ చాలించాలనుకొన్నాడు. గుట్టు రట్టయితే వరూథిని శపించవచ్చని శకించాడు. వసరు పూసిన సిద్ధుడు కనబడ్డాడని అబద్ధమాడాడు. ఇంటి పరిస్థితులు అస్త వ్యస్తమయ్యాయని చెప్పాలన్నాడు. వరూథినికి నచ్చచెప్పి తనదోవన తాను పోయాడు.

## చతుర్థాశ్వాసం

వరూథిని నవమాసాలు మోసి కుమారుణ్ణి కన్నది. అక్కడున్న మును లతనికి స్వరోచి అని నామకరణం చేశారు. స్వరోచి పెద్దవాడై మందర పర్వత ప్రాంతంలో విశ్వకర్మ నిర్మించిన నగరంలో ఆటవిక సేన సేవిస్తుంటే రాజ్యం చేయసాగాడు. ఒకనాడు ఎరుకల రేడు కోరగా వేటాడటానికి విపినవాటికి వెళ్లాడు. ఆ సమయాన దుశ్శకునాలు గోచరిస్తున్నాయని శకునం చెప్పేవాడు చెప్పాడు. ఏ ఆపదనైనా ఎదుర్కొనటానికి సిద్ధంగా స్వరోచి విల్లు చేపట్టాడు. అప్పుడతనికి జయం శుభం కలిగే సూచనలు కనిపించాయి. అంతలో అనా థను, అబలను రక్షించండన్న ఆర్తరావం వినబడింది. ధ్వనినిబట్టి పోగా ఒక వనిత కనబడింది. మూన్నాళ్లుగా ఒక రాక్షసుడు తన ప్రాణహరణానికి వెంటాడు తున్నాడని, ఆమె తన బాధకు కారణం చెప్పింది. తన కథ విప్పింది. ఇందీ వరాక్షుడనే గంధర్వుని కుమార్తెను, పేరు మనోరమ, పారర్షి పుత్రిక కళావతి, మందార విద్యాధర పుత్రిక విభావసి నా సఖులు. ఒకనాడు ముగ్గురం కలిసి

విహారం చేస్తుంటే కంటబడిన ముసలి మునిని అవమానించాం. అతడు రాక్షసునికి బలికమ్మని నాకు శాపమిచ్చాడు నా సఖులు మునిని నిందించారు. కోపించిన ముని వారికి క్షయరోగం రావాలని శపించాడు. వారు రోగగ్రస్తులయారు. నేను రాక్షసభయగ్రస్తను. నీకు అస్త్ర విద్య ప్రసాదిస్తాను. రాక్షసుని బారి నుంచి రక్షించు అని కోరింది.

స్వరోచి శుచిగా విద్యాగ్రహణం చేశాడు. రక్కసునితో తలపడి ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. రాక్షసుడు గంధర్వుడుగా మారాడు.

## పంచమాశ్వాసం

నేను ఇందీవరాక్షుణ్ణి, నీ తల్లి అయిన వరూధినికి తమ్ముణి. శాపవశాన రాక్షసుడనై నా కూతురి ప్రాణాల్నే హరించటానికి ప్రయత్నించాను. అన్నాడు. మనోరమ తండ్రి పాదాలకు నమస్కరించింది. స్వరోచి ఇందీవరాక్షుని శాప కారణం అడిగాడు. నలనాభుడనే ఋషి, శిష్యులకు ఆయుర్వేదం బోధిస్తున్నాడని విని నేను విద్యాదానం అర్థించాను. అతడు తిరస్కరించాడు. నేను కపటవేష తో శిష్యుణ్ణయాను. విద్య నేర్చుకొన్న తరవాత అతణ్ణి పరిహసించాను. అప్పుడాముని నన్ను రాక్షసుడవు కమ్మని శపించాడు. నేను తప్పు తెలుసుకొని పాదాలమీద పడి ప్రార్థించాను. కొన్నాళ్లకు నీ కూతురినే మింగబోయి ఒక ధన్యుడి బాణాగ్నికి నిజరూపం పొందుతావని అనుగ్రహించాడు. నీవల్ల నేనూ ధన్యుణ్ణయాను. ఆయుర్వేద విద్యతో సహా నా పుత్రికను కూడా స్వీకరించమని ఇందీవరాక్షుడు కోరాడు. మనోరమా స్వరోచుల వివాహం చేసి స్వరోచికి అనేకమైన కానుక లిచ్చాడు.

## షష్ఠాశ్వాసము

స్వరోచి కేళీగృహంలో మనోరమ చెంత చేరాడు. ఆనందించాల్సిన తరుణంలో ఆ తరుణి కంటతడి పెట్టటం చూసి కారణమడిగాడు. నా కారణాన రోగ గ్రస్తులయిన సఖులు దుఃఖిస్తుంటే నేనెలా సుఖించ గలనంది మనోరమ. స్వరోచి మనోరమతో కలిసి సఖులున్న చోటికి వెళ్లాడు. ఆయుర్వేద చికిత్స చేసి వారిని స్వస్థుల్ని చేశాడు. విభావసిని తనకు తెలిసిన మృగపక్షి జాతుల భాషను గ్రహించి తనను పరిగ్రహించమని కోరింది. కళావతి తన కథ

చెప్పింది. నా తండ్రి పార్షి తపస్సు చేస్తుంటే ఇంద్రుడు పుంజికస్థల అనే అచ్చరను తపో భంగానికి పంపాడు నా తండ్రి వసంత ఋతువుకి పరవశమై, అచ్చరకు వశమై పోయాడు. వారిద్దరికి కలిగిన దాన్నే నేను నన్ను వదిలేసి ఇద్దరూ యధేచ్ఛగా వెళ్లిపోయారు. నేను చంద్రకిరణాలలో జాలువారే అమృత రసంతో జీవించాను అప్పుడు ముని నన్ను చూసి జాలిపడి కళావతి అని పేరు పెట్టి పెంచి పెద్ద చేశాడు దేవాసి అనే ఖేచరుడు నన్ను కోరి నా తండ్రి చేత తిరస్కరించబడ్డాడు. కోపంతో పగవేరని ఖేచరుడు అర్ధరాత్రి సమయాన నా తండ్రిని సంహరించాడు. తండ్రికి సంస్కారం చేసి నిస్పృహతో ప్రాణ త్యాగం చెయ్యబోతున్న నన్ను పార్వతి వారించింది. స్వరోచి నీకు భర్త కాగలడని చెప్పి పద్మిని అనే విద్యను ప్రసాదించించింది. ఆ విద్యతో సహా నన్ను పరిగ్రహించమని కోరింది కళావతి. స్వరోచి విభావసిని, కళావతిని కూడా వివాహమాడాడు.

స్వరోచి ముగ్గురు భార్యలతో కలిసి తటాక తీరాన విహరిస్తుంటే ఒక హంస చక్రవాకితో అన్న మాటలు వినబడ్డాయి. పూవూ తావిలా స్వరోచితో ముగ్గురు భార్యలు కలిసిపోయారంది హంసి. చక్రవాకి అంగీకరించలేదు. పలువురు స్త్రీల మీద ప్రేమ కలగటం అబద్ధం. ఆ రాజుకన్నా నేనే అదృష్ట వంతురాలనంది చక్రవాకి. ఈ మాటలు స్వరోచిలోని తమకాన్ని పెంచాయే కాని ఆలోచనను పెంచలేక పోయాయి. నూరేళ్లు సర్వ సౌఖ్యాలు అనుభ వించాడు.

ఒకనాడు ఆడలేళ్లు తనను వెంటాడుతుంటే హరిణం తన సతులకు స్వరోచిని చూపించింది. వనితలకు చిక్కి పెంపుడక్కి తిరగటానికి నేను స్వరోచిలా వెర్రిని కాననటం స్వరోచికి వినబడింది. ఆ మాట స్వరోచిలో ఆలో చన కలిగించింది. వైరాగ్యం ఉదయించింది. అయినా ఆపరాని కోరికలు ఆశ లనే పెంచాయి. మరి నూరేళ్లు సమస్త భోగాలూ అనుభవించాడు.

ఒకనాడు స్వరోచి వేటకు వెళ్లాడు విల్లు ఎక్కుపెట్టి బాణం వదల బోయాడు. అంతలో ఒక ఆడలేడి స్వరోచి సంధించిన బాణంతో తన ప్రాణం తీయమని కోరింది. శరీర త్యాగానికి కారణమడిగాడు స్వరోచి. అన్యకాంతా సక్తుడైన వాణ్ణి వరించి కృశించటం కంటె మరణించటం మేలంది లేడి. ఎవరిని

వరించింది చెప్పమన్నాడు స్వరోచి. నా మనసు నీ పైనే నిలిచిందన్నది హరిణాంగన. నేను నరుణ్ణి, నువ్వు మృగానివి. మనకు కలయిక ఎలా కుదురుతుందని స్వరోచి ప్రశ్నించాడు. నువ్వు అనురాగంతో కౌగిలిస్తే చాలునని లేడి వేడుకొంది. స్వరోచి లేడి కోరిక తీర్చాడు. లేడి వనదేవత రూపం ధరించింది. స్వరోచి ఆమె లేడిలా మారటానికి కారణం అడిగాడు. నేను వనదేవతను. లోకాలను శాసించే మనువు నీవల్ల నాకు కలగాలన్న దేవతల ప్రార్థనమీద నేనీ రూపం ధరించానని చెప్పిందామె. నన్ను వరిస్తే నీకు సుపుత్ర ప్రాప్తి కలుగుతుంది. నీ జన్మ తరిస్తుంది అన్నది. స్వరోచి వనదేవతతో క్రీడించాడు. ఆమె గర్భవతియై ఒక శుభదినాన కుమారుణ్ణి కన్నది. అతడే స్వారోచిషుడు. శాంతి, దాంతి దయా, సత్య, శౌచ నిరతుడు. విష్ణుమూర్తి గురించి తపస్సు చేశాడు. పరమాత్ముడు ప్రత్యక్షమయాడు. స్వారోచిషుడు సాష్టాంగ ప్రణామం చేసి దశావతార స్తవం చేశాడు. భగవంతుడు సంతోషాంతరంగుడై వరం కోరుకొమ్మన్నాడు. స్వారోచిషుడు విష్ణుసేవ కోరాడు. సాలోక్యం కావాలన్నాడు. ద్వితీయ మనువువై ధర్మబద్ధబుద్ధితో లోకాలనేలుకుంటే చివరికి మోక్షం లభిస్తుందని చెప్పాడు విష్ణువు. స్వారోచిషుడు ప్రజలను ప్రశాల్లాగా పాలించాడు. అందరూ ఆయురారోగ్యాలతో పుత్ర పౌత్రులతో ఐశ్వర్యాలతో నూరేళ్ల జీవించారు. స్త్రీలు పతిదేవతలై చరించారు. ప్రజావృద్ధి తామరతంపరైంది.

## ఆణిముత్యాలు

మనుచరిత్ర కృతిపతి అయిన కృష్ణరాయలకు లక్ష్మీనారాయణుడు శుభం కలిగించాలని పెద్దన కృత్యాదిని ప్రార్థనపద్యం చెప్పాడు.

శా. శ్రీ వక్షోజకురంగనాభ మెదపై జెన్నొంద విశ్వంభరా
దేవిన్ దత్కమలాసమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాదినిజ భక్తశ్రేణికిం దోఁచురా
జీవాక్షుండు కృతార్థుఁజేయు శుభదృష్టిన్ గృష్ణరాయాధిపున్. (1-1)

నిర్విఘ్నంగా కావ్యరచన పరిసమాప్తం కావాలని విఘ్నేశ్వరుని ప్రస్తుతించాడు.

ఉ. అంకముఁజేరి శైలతనయా స్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁదొండమున నవ్వలిచన్ గబళింపఁబోయి యా

వంకఁగుచంబుఁగాన కహివల్లభహారముఁగాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గజాస్యునిఁగొల్తు నభీష్టసిద్ధికిన్. (1-4)

కృష్ణరాయల వంశ ప్రశంస చేశాడు.

సీ. కలశపాథోరాసిగర్భ వీచిమతల్లి
కడుపార నెవ్వానిఁగన్నతల్లి
యనలాక్షుఘన జటావనవాటి కెవ్వాడు
వన్నె పెట్టు ననార్తవంపుఁబువ్వు
నకలదైవతబు భుక్షాపూర్తి
కెవ్వాడుపుట్టు గాననిమేని మెట్టపంట
కటికి చీఁకటితిండి కరములగిలిగింత
నెవ్వాఁడు దొగకన్నె నవ్వఁజేయు.

తే. నతఁడు వొగడొందు మధుకైటభారి మఱఁది
కళల నెలవగువాఁడు చుక్కలకు ఱేఁడు
మిసిమి పరసీమ వలరాజు మేనమామ
వేవెలుంగుల దొరజోడు రేవెలుంగు. (1-18)

రాయల ప్రతాపాన్ని వర్ణిస్తూ జైత్రయాత్రలు వివరించాడు.

మ. అలపోత్రి ప్రభుదంష్ట్ర భోగివర భోగాగ్రాశి జాలుధ్భటా
చలకూటోపలకోటి రూపుచెడ నిచ్చల్ రాయగానైన మొ
క్కలు భూకాంతకునున్న నయ్యో నరసక్ష్మాపాలు శ్రీకృష్ణ రా
యల బాహామృగనాభి సంకుమదసాంద్రాలేప పంకంబునన్. (1-35)

ఉ. క్రూరవనేభ దంతహతకుడ్యపరిచ్యుతవజ్ర వంక్తిఁ బొ
ల్పారు మిడుంగుఱుంబురువు లంచువెసం గొనిపోయి పొంత శృం
గార వనద్రుమాళి గిజిగాఁడులు గూఁడులఁజేర్చ దీపికల్
గా రహిఁగృష్ణరాయ మహికాంతుని శాత్రవ పట్టణంబులన్. (1-

మ. ధర కెంధూళులు కృష్ణరాయల చమూధాటీగతిన్ వింధ్య గ
హ్వరముల్ దూరగఁజూచి తారచటఁగాఁప్రై యుండుటన్ జాల న

చ్చెరువై యెట్టని వింతచీఁకటులు వచ్చెన్ జూడరే యంచు వే
సారిదిం జూతురు వీరరుద్ర గజరాట్ శుద్ధాంతముగ్ధాంగనల్. (1-38)

ప్రవరాఖ్యుని రూపగుణశీల వర్ణన.

మ. వరణాద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీచుంబి తాం
బరమై సౌధసుధా ప్రభా ధవళిత ప్రాలేయరుజ్మండలీ
హరిణంబై యరుణాస్పదంబనగ నార్యావర్త దేశంబునన్
బురమొప్పున్ మహికంఠహార తరళస్ఫూర్తిన్ విడంబింపుచున్. (1-49)

ఉ. ఆ పురిఁబాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షాపర శేషభోగి వివిధాధ్వర నిర్మలధర్మకర్మ దీ
క్షాపర తంత్రుఁ డంబురుహగర్భ కులాభరణం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్య తనూవిలాసుఁడై. (1-51)

ఆ. వానిచక్కదనము వైరాగ్యమునఁజేసి
కాంక్ష సేయు జార కామినులకు
భోగ బాహ్యమయ్యెఁబూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁబోలె. (1-52)

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుడునై కమనీయకౌతుక
శ్రీవిధిఁగూఁకటుల్ గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ సౌ
ఖ్యావహయై భజింప సుఖులై తలిదండ్రులుగూడి దేవియున్
దేవరవోలెనుండి యిలు దీర్పఁగఁగాఁపుర మొప్ప వానికిన్. (1-53)

అతిథి తత్పరుడైన ప్రవరునియింటికి సిద్ధుడొకడు వచ్చాడు.

సీ. ముడిచిన యొంటికెంజడమూయ ముప్పన్నె
మొగముతోలు కిరీటముగ ధరించి
కకపాలకేదార కటక ముద్రిత పాణి
గుఱుచ లాతాముతోఁగూర్చి పట్టి
హైణేయమైన యొడ్డాణంబు లవణి చే
నక్కళించిన పొట్ట మక్కళించి

యారకూటచ్ఛాయ నవఘుళింపఁగఁజాలు
బడుగు దేహంబున భస్మమలది

తే. మిట్టయురమున నిడుయోగపట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్ష పోఁగులు చవుకళింపఁ
గావి కుబుసంబు జలకుండికయును బూని
చేరెఁదద్గేహ మౌషధ సిద్ధుఁడొకఁడు. (1-59)

సిద్ధుణ్ణి సేవించిన తరువాత ప్రవరుడు తీర్థయాత్రల విశేషాలడిగాడు. పోయి చూడలేకపోయినా వినాలని కుతూహలపడుతున్నా నన్నాడు. సిద్ధుడు చెప్పాడు

ఉ. ఓ చతురాస్య వంశ కలశోదధిపూర్ణశశాంక! తీర్థ యా
త్రా చణశీలినై జనపదంబులు పుణ్యనదీనదంబులున్
జూచితి నందు నందుఁగల చోద్యములున్ గనుఁగొంటి నా పటీ
రాచల పశ్చిమాచల హిమాచల పూర్వ దిశాచలంబునన్. (1-70)

అంత చిన్నవయసులో అన్నిప్రదేశాలెలా తిరిగిరాగలిగాడని ప్రవరుడికి ఆశ్చర్యం గలిగింది. పాదలేపనం ప్రభావంతో అని సిద్ధుడాతని సందేహం పోగొట్టాడు. ఆ పసరు తనకు దయచేసి పుణ్యక్షేత్రాలు చూడాలన్న తన కోరిక తీర్చమని ప్రవరుడు కోరాడు.

క. అనుటయు రసలింగము నిడు
తన వట్టువ ప్రేఁపసజ్జ దంతపుబరిణన్
నినిచిన యొక పస రిది యది
యని చెప్పక పూసెఁదత్పదాంబుజములకున్. (1-78)

క. ఆ మందిడి యతఁడరిగిన
భూమీసురుఁడరిగెఁ దుహినభూ ధరశృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీఝరీ నిరీక్షాపేక్షన్. (1-79)

చ. అటఁజనికాంచె భూమిసురుఁడంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వన

స్ఫుటనటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
గటకచరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్. (2-8)

మధ్యాహ్న సమయానికి మంచునీటితో పాదలేపనం కరిగిపోయింది. దిక్కుతోచక తనను తానే నిందించుకున్నాడు ప్రవరుడు.

మ. అకలంకౌషధ సత్త్వమున్ దెలియ మాయాద్వారకావంతి కా
శీ కురుక్షేత్ర గయా ప్రయాగములు నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపుఖడ్గ వ్యాఘ్ర మిమ్మంచుఁ గొం
డకు రాఁజెల్లునె? బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా! శ్రోత్రియుల్. (2-16)

అప్పుడొక ఆశ్రమంవంటిది కనబడింది. అక్కడ తనకు దోవచూపించే వారుంటారని అటు నడిచాడు.

క. మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీగంధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలుపుఁదెలుపు నొక్క మారుతమొలసెన్. (2-24)

మ. అతఁడావాత పరంపరా పరిమళ వ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్. (2-25)

ఆమెకూడా ప్రవరుణ్ణి చూసింది. తొట్రుపాటు చెందింది.

ఉ. చూచి ఝుళంఝుళత్కటక సూచితవేగ పదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడన్
బూచిన యొక్కపోఁకనునుబోదియఁజేరి విలోకన ప్రభా
వీచికలన్ దదీయ పదవీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్. (2-29)

ఆమె మనసులో ఆశ చిగురించింది.

ఉ. ఎక్కడివాడొ? యక్షతనయేందు జయంత వసంత కంతులం
జక్కఁదనంబునన్ గెలువఁజాలెడు వాఁడు మహీసురాన్వయం

బెక్కడ? యీ తనూవిభవమెక్కడ? యేలనిబంటుగా మరున్
దక్కఁ గొనంగరాదె? యకటా! నను వీఁడు పరిగ్రహించినన్. (2-35)

ప్రవరుడామె బెదరుపాటు చూశాడు. భయపడవలసిన అవసరం లేదన్నట్లు సంబోధించాడు.

ఉ. ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ! యొంటిఁజరించె దోట లే
కివ్వనభూమి భూసురుఁడ యేఁబ్రవరాఖ్యుఁడఁ ద్రోవతప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్ జనుదెంచి, పురంబుఁజేర నిం
కెవ్విధిఁగాంతు? దెల్పఁగదవే! తెరువెద్ది శుభంబు నీకగున్. (2-39)

ఆమెకు నవ్వువచ్చింది. అతనితో మేలమాడదలచింది. తన కులాన్ని సూచిస్తూనే చమత్కారంగా మాటాడింది.

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వేవ్వరి వేఁడెదు? భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియకాక నీవెఱుఁగవే మునువచ్చినత్రోవ చొప్పు? నీ
కింత భయంబు లేకడుగ నెల్లిదమైతిమె! మాటలేటికిన్. (2-41)

అంటూనే తనకులం చెప్పింది. పాండిత్యం తెలియ జేసింది. చెలికత్తెల గొప్పతనం చెప్పింది. మనసులోనిమాట సూటిగా తెలిపింది.

ఉ. నిక్కమువాపనేల? ధరణీసురనందన! యింక నీపయిం
జిక్కె మనంబునాకు, ననుఁజిత్తజు బారికినప్పగించెదో?
చొక్కి మరందమద్యముల చూఱలఁబాటలపాడు తేంట్ల సొం
పెక్కినయట్టి పూవుఁబొదరిండ్లను గౌఁగిట గారవించెదో? (2-51)

ప్రవరుడు ధర్మంచెప్పాడు. తన నిష్ఠ గురించి చెప్పాడు. వరూధిని ఇంద్రియానందమే బ్రహ్మానందమనిచెప్పి తన కోరిక తీర్చమంది.

శా. ఎందే డెందము కందళించి రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్, గుంభగత ప్రదీప కళికాశ్రీదోప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁగను నాయింపే పర బ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా. (2-62)

వరూధిని చేసేది వింతవాదంగా, వితండవాదంగా కనబడింది ప్రవరునికి.

శా. ఈ పాండిత్యము నీకుఁదక్క మఱి యెందే గంటిమే? కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు, మేలోహో! త్రయీధర్మముల్
పాపంబుల్, రతిపుణ్యమంచు నిఁక నేలా తర్కముల్ మోక్ష ల
క్ష్మీ పథ్యాగమ సూత్రపంక్తి కివెపో మీ సంప్రదాయార్థముల్. (2-64)

మ. తరుణీ! రేపును మాపు హవ్యములచేతం దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు? నా
కరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియము లై నట్లన్యముల్ గా, వొడల్
తిరమే? చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ మీ పాలవైఁదేనియల్ (2-65)

ప్రవరుడి ప్రవర్తన వరూధినికి బాధ కలిగించింది.

చ. అనుటయు మాటలేక, హృదయాబ్జముజల్లన, మోమువెల్లనై
కనలుచు నీరుదేఱు తెలికన్నుల నాతనిఁ బుల్కుపుల్కనం
గనుఁగొని మాటలందొదవు గద్గదకందలయూచి యక్కటా
వనిత తనంతఁదావలచి వచ్చినఁజుల్కనగాదె యేరికిన్? (2-66)

వరూధిని ఉద్రేకం సైపలేక ప్రవరుని కౌగలించుకోబోయింది.

శా. ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁబాలిండ్లు వొంగారఁబై
యంచుల్ మోవఁగఁగౌగిలించి యధరం బాసింప 'హా! శ్రీహరీ'
యంచున్ బ్రాహ్మణుఁడోరమోమిడి తదీయాంసద్వయంబంటి పొ
మ్మంచు ద్రోచె, గలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్. (2-68)

వరూధినిమనను గాయపడింది. దుఃఖం కట్టలురికింది. కన్నీరుతో కరుగుతాడనుకొంది.

ఉ. పాటున కింతులోర్తురె? కృపారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోటఁ భవన్నఖాంకురము సోకె, గనుంగొనుమంచుఁజూపి య
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చె, గలస్వనంబున్‌తో
పీటిన విచ్చు గుబ్బచనుమిట్టలనశ్రులు చిందువందఁగన్. (2-70)

ప్రవరుడు మాటా పలుకులేకుండా మేనికంటిన జవ్వాది కడిగి అగ్నిహోత్రుణ్ణి ధ్యానించాడు. అగ్నిహోత్రుడు ప్రవరుణ్ణి అరుణాస్పదపురం చేర్చాడు. వరూధిని ప్రవరుణే తలచుకుంటూ దిగులుపడింది.

ఉ. కమ్మని కుందనంబు కసుగందనిమే; నెలదేఁటి దాఁటులన్
బమ్మెరవోవఁదోలుఁ దెగబారెఁడు వెండ్రుకఁ లిందుబింబమున్
గిమ్మన నీదుమోము, గిరిక్రేపులు మూఁపులు కౌనుగానరా
దమ్మక చెల్లః వాని వికచాంబకముల్ శతపత్ర జైత్రముల్. (3-6)

ఉ. ఎంత తపంబు సేసి జనియించినవారొక మర్త్యభామినుల్
కాంతుడవజ్ఞసేసినను గాయము వాయుదు రే నమర్త్యనై
చింతల వంతలంజిలికి సిగ్గఱితిన్; మృతిలేనినాదు చె
ల్వింతయు శూన్యగేహమున నెత్తిన దీపికయయ్యె నక్కటాః (3-3)

అపుడు సంధ్యా సమయమైంది.

సీ. రవిబింబ పతనదీర్ణ పయోధిగర్భని
ర్గత శేషఫణి ఫణారత్నరుచియొ
దివసావసానసందీప్తా స్తగిరిశిఖా
జ్యోతిర్లతాప్రతానాతపంబొ
తపనదోర్దండ నిర్దళిత దిక్తటదృశ్య
కమలజాండ కటాహకనకృణియొ
చండీశతాండవోత్సవ సంభృతక్షపా
హస్తాగ్రదీప గభస్తిచయమొ.

తే. ద్రాగ్విదాహచ్ఛి దావినిద్రాళుమదవ
దంజనాలన మూలశయ్యావిధాన
వారుణాధోరణా కల్పితోరుశోణ
మృత్తికారాశియో యనమెఱసె సంధ్య. (3-15)

చంద్రోదయమైంది.

చ. మరునకొసంగఁగాలము తమశ్చట గాటుకగా నవోదయ
స్ఫురదరుణ ప్రభాపథిక శోణితసిక్తసితోడు భక్తమున్
హరిహయదిఙ్న భస్థలమునన్ బలిచల్లి వటాంకమున్ వసూ
త్కరభరితంబునై! వెలుఁగఁగాచి సుధానిధి నెత్తెనత్తఱిన్. (3-21)

మ. స్ఫుటసౌగంధికరాగరక్తరుచిమైఁబూనెన్ జపాసన్నిధి
స్ఫటికంబట్లు దయాద్రి గైరికశిరస్థానస్థితిన్ జంద్రుఁ; డ
చ్చోటు వాయన్ శుచి యయ్యెనౌ; బ్రకృతిసచ్ఛం బైన సన్మార్గి యె
న్నఁటికింగ్గూటమి వంకవచ్చు వికృతిన్ మగ్నుండు గానేర్చునే? (3-24)

వరూధిని వేదన చూడలేక వనసీమనుంచి యింటికి మరలించటానికి చెలికత్తెలు ప్రయత్నించారు.

చ. ఉడుపతిబారికిన్ వెరచి యూఁజట యౌనని పేరుటామనిన్
ముడివడు కంతుసేనలకు ముయ్యేలగుట్టయినట్టి యిందు రా
నడఁగునె తాపవహ్ని? మనమై హరిణేక్షణ! ముల్లు పుచ్చి కొ
ఱ్ఱడఁచిన చందమయ్యెఁ బదమా యెలదోఁట జరింపకింటికిన్. (3-34)

వరూధినినే వరించి తిరస్కరింపబడిన గంధర్వుడొకడున్నాడు.

శా. ఏ గంధర్వుఁడు తద్విలాసములు మున్వీక్షించి తా నెంతయున్
రాగాంధుండయి కోరి హత్తక గడున్ రాచాపులన్ గంతుడు
ద్వేగంబందఁగఁ జేయ నెవ్వగల నువ్విళ్లూరుచున్ వేఁగువాఁ
డా గంధర్వ కుమారుఁ డంగ భవవిద్యా పారగుం డాత్మలోన్. (3-63)

ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖులొల్లమి సేయుదు, రొక్కవేళ, బె
న్మక్కువ నాదరింతురు; క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్
పక్కన వేసటన్ జన; దుపాయములన్ దగు నిచ్చకంబులన్
జిక్కఁగఁజేసి డాసి సతిచిత్తముఁబట్టి సుఖింపగాఁదగున్. (3-69)

అని భావించి వరూధినిమనసుకెక్కిన ప్రవరుని రూపలావణ్యాలను శాంబరీ మహిమతో పొందాడు. వరూధినికి తనంతట తనను ప్రవరునిగా గుర్తించేవరకు ఆ చాయలోనే తిరగసాగాడు. వరూధినిచూసి ప్రవరుడనే నమ్మింది.

ఉ. ఏలర యీ చలంబుడిగి యేలర బాలరసాలమాలతీ
జాలములో శశాంకకరజాలములో వలవంత నశ్రువుల్
జాలుగ నాల్గుజాలు నీకఁజాలు భవం బమనంతకాఁ కకుం
బాలయి ర్రాత్రి పంచశరుబారికిఁజిక్కితి నీకుదక్కితిన్. (3-93)

గంధర్వుడు వరూధినిమీద జాలితో తిరిగివచ్చినట్లు నమ్మించాడు.

క. ఐనం గానిమ్ము; భవ
దీనతకై వ్రతము విడిచితిం; బరులకు మే
లైనన్ జాలు; శరీరం
బైన నుపేక్షింప వలయు; నది యట్లుండెన్. (3-100)

అని తను శరీరాన్ని వదిలిన నిజాన్ని చెబుతూనే వరూధిని కన్నుగప్ప గలిగాడు.

వరూధిని ప్రవరుని తేజోమూర్తినే మనసున నిలుపుకొని నవమాసాల తరవాత కుమారుణ్ణి కన్నది.

శా. తేజంబబ్జభవాండ గేహమునకున్ దీపాంకురచ్ఛాయయై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁజేరంబోని లగ్నంబునన్
రాజీవాక్షి కుమారుఁగాంచె సుమనోరాజన్యమాన్యున్ జనుల్
జే జేపెట్టఁబ్రసూన వర్ష మమరశ్రేణుల్ ప్రవర్షింపఁగన్ (4-35)

వరూధిని పుత్రుడు స్వరోచి రాజ్యమేలుతూ ఎరుకరేని కోరికపై వేటకు వెళ్లినప్పుడు వనం రకరకాల మృగాలతో సంరంభంగా ఉంది.

మ. చకితైణాహుతదావ మావశితపుచ్ఛస్వల్పగచ్ఛత్తర
క్షుక మద్రిగ్రహయాళుభల్లుకము వక్షోభాగానిక్షిప్తడిం
భకవల్గత్ప్లవగీకదంబము హ్రదాంభః ప్రోత్థితక్రోడనా
యక మాభీలముఖద్వివస్థపుటితం బయ్యెన్ వనంబత్తఱిన్ (4-38)

మనోరమను రక్షించటానికి స్వరోచి పోరాడుతున్న రాక్షసుని తీవ్రతకు చెంచులు పరుగులు పెడుతున్నప్పుడు భయపడవద్దని స్వరోచి హెచ్చరిక చేశాడు.

ఉ. కైదువుసున్న; పూజ్యములు కంకటఖేటశిరస్త్రసత్రముల్
లేదరదంబు తత్తడి హుళక్కి; సహాయమొ సర్వమంగళం
బీ దనుజుండు చిక్కె; భయమేటికి లుబ్ధకులార! యాత్మకుం
బేదతనంబు మేలె? మఱి మృత్యువుడాఁగెడిచోట లేదొకో? (4-105)

స్వరోచి ప్రయోగించిన ఆగ్నేయాస్త్రానికి రాక్షసుడు ఇందీవరాక్షుడుగా మారాడు. తన శాప కారణం చెబుతూ విద్యాదానం నిరాకరించిన బ్రహ్మమిత్రునితో తానన్న మాటలు చెప్పాడు.

శా. తండ్రీ! నాకు ననుగ్రహింపఁగదె వైద్యంబంచు ప్రార్థించినన్
గండ్రల్ గా నటులాడి ధిక్కృతిఁబొకాల్మంటివోహో! మదిన్
దీండ్రల్ గల్గినవారి కేకరణినేనిన్ విద్య రాకుండునే?
గుండ్రాడాఁచినఁబెండ్లి యేమిటికిఁ జిక్కుంగష్టముష్టింపచా! (5-17)

స్వరోచితో వివాహం జరిగిన తరవాత తన దీనస్థితికి కారణం వివరించింది మనోరమ.

ఉ. అక్కట! నాయెడన్ మిగుల నక్కఱగల్గి చరించునెచ్చెలుల్
చిక్కి మునీంద్రశాపహతిఁ జెందన దుర్దమరోగ బాధలం
బొక్కుచు నున్నవారు వనభూములఁ దద్దశమాన్పవేని నా
కెక్కడి సౌఖ్యమన్నఁ దరళేక్షణఁ జూచిస్వరోచి యిట్లనున్ (6-10)

స్వరోచి మనోరమ కళావతి విభావసి అనే ముప్వురు భార్యలతో తటాక విహారం చేస్తుంటే హంసి వారి ఆనందానికి అవధి లేదంది. చక్రవాకి ఆ మాట నిజం కాదంది.

చ. పలువురయందు నొక్కనికిఁబ్రాఁతియునొక్కనియందుఁజూడన
గ్గలమగు ప్రేమ పల్వురకుగల్గుటయద్భుతమట్లుగాన యి
వ్వెలదులయందుఁ గూర్మి పన వీనికి నేమియులేదు; వీనియం
దలవశఁగల్గదీ జలరుహాక్షులకుంబ్రియమెవ్విధంబునన్. (6-70)

మరొకసారి తన వెంటపడిన ఆడలేళ్లను మగలేడిఅదలించటం స్వరోచి కంటపడింది. ఆ హరిణం పలుకులు విన్నాడు.

శా. హుంకారంబొనరించి వే తలఁగుఁడోహో! నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లపుడుదర్పస్ఫూర్తిఁగ్రీడింప ల
జ్జాంకూరంబడఁగించినారుఁ తలపోయన్నాకు రోతయ్యె, మీ
రింకన్ బోయి వరింపుఁ డొక్కరుని భోగేచ్ఛన్ నివారించితిన్. (6-79)

స్వరోచి వేటకు వెళ్లినపుడు ఒక లేడి బాణంతో తన ప్రాణం తీయమని కోరింది. కారణం అడిగితే అన్యకాంతాసక్తుడయిన వాడిమీద మనసయింది, మరణం తప్ప మార్గాంతరం లేదంది.

చ. చెదరక నామనంబు నృపశేఖర నీయెడనిల్చిమన్మథ
ప్రదరపరంపరానిహతి పాల్పడి వ్రేఁగెడునట్లుగాన నా
యదటడగింపు మన్న హరిణాంగన వీవునరుండ నే ముదం
బొదవగ నీకు నాకు మిథునోచితకృత్యములెట్లు చేకుఱున్. (6-94)

దేవతల కోరికపై స్వరోచిని వరించి వచ్చిన వనదేవతతో క్రీడించాడు స్వరోచి. ఆమె గర్భవతియై స్వారోచిషుణ్ణి కన్నది.

శా. కాంచెంబుత్రు విశాలనేత్రుఁబృథువక్షఃపీఠి విభ్రాజితుం
బంచాస్యోద్భటశౌర్యధుర్యఘన శుంభద్బాహుఁదేజోనిధిం
బంచాస్త్రప్రతిమాను మానఘను సామ్రాజ్యైకహేతుప్రభా
తాంచల్లక్షణలక్షితున్ సుగుణరత్నానీకరత్నాకరున్. (6-99)

స్వారోచిషుడు విష్ణుమూర్తి గురించి తపస్సు చేస్తే అతడు ప్రత్యక్షమయాడు.

సీ. నీల మేఘము డాలు జీలుసేయఁగఁజాలు
మెఱుఁగుఁజామనచాయమేనితోడ
నరవిందములకచ్చులడఁగించు జిగిహెచ్చు
నాయతంబగు కన్నుదోయి తోడఁ
బులుఁగు రాయనిచట్టుపలవన్నె నొరవెట్టు
హంబట్టు జిలుఁగు గెంటెంబుతోడ
నుదయార్క బింబంబు నొఱపు విడంబంబుఁ
దొరలంగ నాడు కౌస్తుభము తోడ
జయజయధ్వని మౌళి నంజలులు సేర్చు
శర్వశతధృతి శతమన్యు శమన శరధి
పాలకైలబిలాది దేవాళి తోడ
నెదుటఁబ్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు. (6-102)
విష్ణుమూర్తి స్వారోచిషుణ్ణి ద్వితీయ మనువువై లోకాల నేలుకొమ్మన్నాడు.

చ. అని మహిమన్ మనుత్వమున కాతనిఁబట్టముగట్టి పద్మలో
చనుఁడు విరించి శర్వముఖ సర్వ సుపర్వులతో నదృశ్యుడై
చనియె నిజాలయంబునకు శాస్త్ర వినిశ్చయయుక్తి దండపా
లనముల నవ్విభుండు ప్రజలం బ్రజలట్లరసెన్ గృపామతిన్. (6-120)

కురంగనాభము - కస్తూరి
విశ్వంభరాదేవి - భూదేవి
వందారు - నమస్కరించుచున్న
అంకము - ఒడి
అహివల్లభ హారము - సర్పరాజనెడి హారము
మృణాళాంకుర శంక - తామరవంటి తూటమొలకఅను ఽనుమానము
కలశ పాథోరాశి - పాలసముద్రము
అనలాక్షుడు - శివుడు
అనార్తవంపు పువ్వు - ఋతువులతో సంబంధము లేని పుష్పము
బుభుక్ష - ఆకలి
వలరాజు - మన్మధుడు
వేవెలుంగుల దొరజోడు - సహస్రకిరణుడైన సూర్యునకు జతగాడు
రేవెలుంగు - చంద్రుడు
పోత్రి ప్రభు - వరహస్వామియొక్క
దంష్ట్ర - కోర
మృగనాభి - కస్తూరి
సంకుమద - జవ్వాది
వనేభ - అడవియేనుగులయొక్క
దంత - కొమ్ములచేత
హత - కొట్టబడిన
కుడ్య - గోడలనుండి
పరిచ్యుత - జారినట్టి
చమూ - సేన
వప్రస్థలి - కోట పైభాగము
ప్రాలేయరుక్ - మంచుకాంతిగల చంద్రునియొక్క
మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి - మన్మధునిలా, చంద్రునిలా, అంద
మైన విగ్రహము కలవాడు

అధ్వరము - యాగము
అంబురుహ గర్భ కులాభరణము - బ్రాహ్మణ కులమునకు అలంకారము
యజ్వ - యాగము చేసినవాడు
ముప్పన్నె మృగముతోలు - పెద్దపులి చర్మము
కకపాల - సంచి
కేదార కటకము - పంచలోహముల కడియము
లాతము - దండము
ఐణేయము - ఆడలేడిచర్మముతో చేసినది
లవణి - బిగి
ఆరకూటము - ఇత్తడి
అవఘళించు - తిరస్కరించు
చవుకళించు - కదలు
జల కుండిక - కమండలము
పటీరాచలము - గంధపు కొండ
నినిచిన - నిండించిన
హేమాఢ్యము - సువర్ణమయము
ఝరి - సెలయేరు
లుఠత్ - దొర్లుచున్న
నిస్వనము - ధ్వని
కలాపి జాలము - నెమిళ్లగుంపు
సాలము - చెట్టు
వేదండము - ఏనుగు
వీటి - తాంబూలము
శతపత్రము - తామరపువ్వు
కటకము - అందె
కంతుడు - మన్మథుడు
డక్కగొను - వశపరచుకొను
ఎల్లిదము - చులకన
ప్రాజదువు - వేదము
హవ్యములు - నేయి మొదలైన హోమద్రవ్యములు
అంసము - బుజము
బమ్మెరవోవు - దిగ్భ్రమచెందు

దీర్ణ - పగిలిన
అతపము - ప్రకాశము
తపన - సూర్యుని యొక్క
ధూర్దండ - రథాగ్ర భాగమందలి కర్ర
కటాహము - గంగాళము
క్షపా - రాత్రి (ఆనుస్త్రీ యొక్క)
గభస్తి చయము - కాంతి సమూహము
ఆలానము - కట్టు కంబము
ఆధోరణ - మావటీని చేత
ఉడు భక్తము - నక్షత్రములనెడు అన్నము
వటాంకము - మర్రిచెట్టు గుర్తుగా కలది
రసాలము - మావిచెట్టు
తరక్షుకము - సివంగులు కలది
ప్లవగీ కదంబము - ఆడుకోతుల సమూహము (కలది)
ద్వీపి - పెద్దపులుల చేత
స్థపుటితము - మెట్ట పల్లములుగా చేయబడినది
కైదువు - అయుధము
కంకట ఖేట శిరస్థలత్రముల్ - శరీర కవచము, డాలు, శిరస్సునకు, అర చేతులకు కట్టుకొను రక్షకములు
కష్ట ముష్టింపచా - నీచుడగు బిచ్చగాడా!
పంచాస్త్రుడు - మన్మధుడు
హొంబట్టు - బంగారు రంగు పట్టు
గెంటెము - జమిలినేత వస్త్రము
శర్వుడు - శివుడు
శతధృతి - బ్రహ్మ
శతమన్యుడు - ఇంద్రుడు
శమనుడు - యముడు
శరధిపాలకుడు - వరుణుడు
ఐలబిలుడు - కుబేరుడు